భార్య: [కోపంతో] పసిబిడ్డకు పాలియ్యవద్దంటావాదేంటి?

వెంకటే: పెసాదమె.

భార్య: [కోపముతో] నీ పెసాదం పెన్నలో గలిసింది. తీర్థం దిగబడ్డది. పాపం! ఆ అమ్మ యెవరో దిక్కులేకుండా పడిపొయ్యింటే వాళ అసుపత్రికి తీసుకపోకుండాను. మనమేమన్నా రాయికట్టుకోని శిలా శాశిపితంగా వుంటామా? [వెంకటరెడ్డితట్టు తిరిగి] మీరొకతట్టు ఎత్తుకోండి. మా యింటాయన యింకొకతట్టు ఎత్తుకుంటాడు. బిడ్డను నేను ఎత్తుకోని వస్తాను.

రంగా: That is real worship! Grand!

వెంకట: [ఆనంద పులకితుడై] తల్లీ, దండం పెడ్తున్నాను.

భార్య: మీబోటి గొప్పవాళ్ళు అట్లనవద్దండి. ఇదెంతభాగ్గెం లేండి.

వెంకటే: బయటికొచ్చినప్పుడుగూడా నామీద పెత్తనమేనా? ఈ ఆడోళ్ళతో యేగేది కనాకష్టం. అయితే కానియ్యండయ్యా.

[వెంకటరెడ్డి వెంకటేసు దుప్పటి ఉయ్యాలగా కట్టి రోగిని దానిలో కూర్చుండబెట్టుచుందురు.]

రంగా: [కళ్యాణ రెడ్డితో] ఈ విలేజర్సు (villagers) కు చదువులేదు. ఆర్టు, పొయిట్రి తెలియదు. అయినప్పటికి హృదయంలో మాత్రము సింపతి (sympathy) విశేషంగావుంది. గాంధీ టోపీల వాళ్ళుకూడా—— Grand! I feel [మనస్సులో భావ సంఘర్షణము కలిగిన వానివలె అటునిటు తిరుగును.]

[ఉయ్యాలలో మధ్య కఱ్ఱదూర్చి ఒకతట్టు వెంకటరెడ్డి యింకొకతట్టు వెంకటేసు ఎత్తుకొందురు. వెంకటేసుభార్య

రోగి బిడ్డనెత్తుకొనును. నరసింహం వెంకటేసు సామానులను తీసుకొని సైకిలుసీటు వెనుకనున్న స్ట్యాండ్ (stand) పై పెట్టి కట్టును. వాళ్ళ బిడ్డను సైకిలుసీటుపై నెక్కించుకొని తాను పట్టుకొని సైకిలు నడిపించును.]

రోగి: [ఉయ్యాల యెత్తుకొన్న వెంటనే] నాయన్లకందరికీ దణ్ణమయ్యా మీచాతి మోయించుకుంటున్నాను. పాపిష్టురాల్ని. మీయింట్లో కుక్కగానైనా పుట్టి మీఋణం తీర్చుకొంటాను తండ్రీ.

రంగా: [గద్గద స్వరముతో, కన్నులనిండ నీళ్ళు క్రిమ్ముచుండ] Reddy—I feel—నీ మానవసేవాపరాయణత్వం, ఆ పల్లెటూరి యిల్లా అవ్యాజ కారుణ్యం —నన్ను ముగ్ధుణ్ణి కావించింది. సిగ్గుపరిచింది [రోగిని నిర్దేశించి] ఈమె కృతజ్ఞతలో వుండే అవ్యక్తమాధుర్యం నాహృదయాన్ని కరిగించింది. Oh, it is grand.— grander—grandest. Damn my Poetry—damn my art. [వెంకటరెడ్డి వెనుకకువచ్చి భుజము కఱ్ఱకు ఆనించి] ఇప్పుడు నేను కృతార్థుణ్ణి. I feel happy. Hail Congress! Hail! [కదలుదురు]

కళ్యాణి: మా మహాత్మ యీదృశ్యం చూస్తే!

[తెరపడును.]

సంపూర్ణము

---

# కవికోకిల గ్రంథావళి

## (1) కావ్యసంపుటము:

ఇందు నలజారమ్మ, వనకుమారి, కృషీవలుఁడు, జలదాంగన, యువకస్వప్నము, కడపటివీడ్కోలు, పానశాల అనుకావ్యములు గలవు. రు 2—0—0.

## (2) ఖండకావ్యసంపుటము:

ఇందు 1916 మొదలు 1932 వఱకు రామిరెడ్డిగారు రచించిన ఖండకావ్యములన్నియు చేర్పఁబడియున్నవి. నక్షత్రమాల, నైవేద్యము, భగ్నహృదయము, పరిశిష్టము, ప్రథమకవిత్వము అని 5 భాగములుగ విభజింపఁబడియున్నది.

రు 2—0—0.

## (3) నాటక సంపుటము:

ఇందు సీతావనవాసము, కుంభరాణా (మీరాబాయి), మాధవ విజయము అను మూడునాటకములును, కాంగ్రెస్ వాలా అను ఏకాంక నాటకమును చేర్పఁబడియున్నవి.

రు 2—0—0

## (4) వ్యాస సంపుటము:

ఇందు రామిరెడ్డిగారు రచించిన సారస్వతవ్యాసములన్నియు గలవు. రు 0—12—0.

# విడిప్రతులు



| | | | |
|---|---|---|---|
| 1. | నలజారమ్మ | (కావ్యము) | 0— 4—0 |
| 2. | వనకుమారి | ,, | 0—12—0 |
| 3. | కృషీవలుఁడు | ,, | 0— 6—0 |
| 4. | జలదాంగన | ,, | 0— 6—0 |
| 5. | పానశాల | ,, | 0— 8—0 |
| 6. | నక్షత్రమాల | (ఖండకావ్యములు) | 0—12—0 |
| 7. | సీతావనవాసము | (నాటకము) | 1— 2—0 |



గ్రంథములు దొరకుచోట్లు:

వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండుసన్సు,
ఎస్ప్లనేడు. ఈ, మదాసు.

వి వెంకటసుబ్బయ్యనాయుడు అండ్ సన్సు,
బుక్కు సెల్లర్స్, చిన్నబజారు, నెల్లూరు

ప్రభాత ముద్రణాలయము,
నెల్లూరు